# అదోనీరామ్ జడ్సన్

## జీవిత చరిత్ర



# అదోనీరామ్ జడ్సన్

ఆ పాస్టరు గారు గంభీరంగా ప్రసంగం చేస్తున్నారు. ఎడమ చేతిలో బైబిలు పట్టుకున్నారు. సంఘ సభ్యులను ప్రేమ కలిగి ఉండండి అని హెచ్చరిస్తున్నాడు. సంఘం సభ్యులు శ్రద్ధగా వింటున్నారు. పాస్టరు గారి వయస్సు 5 సంవత్సరములు. సంఘ సభ్యులు ఎనిమిది మంది ఉన్నారు. వారందరి వయస్సు 6 సంవత్సరముల కంటే తక్కువ. ఆ పాస్టరు గారి పేరు అదోనీరామ్ జడ్సన్.

జడ్సన్ 1788 సంవత్సరములో ఆగస్టు 9వ తేదీన భక్తిగల పాస్టరు గారికి జన్మించాడు. తండ్రి పేరు అదోనీరామ్, తల్లి పేరు అబీగయీలు. తండ్రి ఎంతో నిష్టగల క్రైస్తవుడు. ఇంట్లో ఎంతో క్రమశిక్షణ ఉండేది. 3 సంవత్సరములకే జడ్సన్ చదవడం నేర్చుకున్నాడు. జడ్సన్‌కు ఇష్టమైన పాట చాటించుడి యేసు నామము. (Go preach my Gospel, saith

the Lord) 12 సంవత్సరములకే పెద్ద పెద్ద పుస్తకములను అవలీలగా చదివేసేవాడు. 19 సంవత్సరములు వచ్చేసరికి జడ్సన్ స్వయంగా స్కూలు ప్రారంభించి సంవత్సరము పాటు నడిపాడు. స్వయంగా రెండు పాఠ్య పుస్తకములను ప్రింట్ చేసాడు. (The elements of English grammmar, The young lady's Arithmetic) 1805 జడ్సన్ బ్రౌన్ యూనివర్సిటీలో చేరాడు. అతడు శ్రద్ధగా చదివేవాడు. తెలివైన విద్యార్థి.

అమెరికాలో ఆ రోజులలో థామస్ పైన్ అనే వ్యక్తి కామన్ సెన్స్ అనే పుస్తకమును ప్రచురించాడు. ఆ పుస్తకములో క్రైస్తవ మతము గాని, యూదా మతము గాని, ఇస్లాం మతము గాని మానవులు కనిపెట్టినదే. తెలివైన వారు అధికారమును, లాభమును చేజిక్కించు కొనుటకు మతమును కనిపెట్టినారు అని వివరించాడు. చాలమంది ఆ పుస్తకము పట్ల ఆకర్షితులై నిరీశ్వర

వాదమును (దేవుడు లేడు అనే వాదము) అవలంభించుట ప్రారంభించారు. జడ్సన్ స్నేహితుడైన జాకబ్ ఎర్మ్స్ అనే వ్యక్తి చక్కగా ప్రసంగించేవాడు. కామన్ సెన్స్ పుస్తకములోని విషయములను అందరికీ వివరించేవాడు. అతడి ప్రభావముతో జడ్సన్ నిరీశ్వర వాదము వైపు మొగ్గు చూపాడు కాని ఈ విషయం తల్లి దండ్రులకు చెప్పలేదు. 1807లో పట్ట భద్రుడైనాడు. తన 20వ పుట్టిన రోజున తల్లి దండ్రులకు "నేను బైబిలును నమ్ముట లేదు" అని చెప్పాడు. తండ్రి ఎంత నచ్చజెప్పినా జడ్సన్ వినలేదు. తల్లి ఏడ్చింది అయినా జడ్సన్ మారలేదు. తాను న్యూయార్క్ వెళ్లి స్వంతంగా జీవించాలని తలంచి జడ్సన్ బయలుదేరాడు. అప్పుడప్పుడు మనస్సాక్షి గద్ధించినా దానిని తొక్కి పట్టేవాడు.

ఒక రోజు ఒక సత్రములో బస చేయుటకు వెళ్లినప్పుడు సత్రపు యజమాని ఒకే ఒక్క గది ఖాళీగా

ఉన్నది కానీ ఆ గదికి ప్రక్కన ఉన్న గదిలో చావడానికి సిద్ధంగా ఉన్న ఒక యువకుడు బస చేస్తున్నాడు. అతని వల్ల నీకు ఇబ్బందిగా ఉంటుందేమో? అన్నాడు. అప్పుడు జడ్సన్ "నాకు భయం లేదు. నేను నాస్థికుడను" అన్నాడు. ఆ రాత్రి జడ్సన్‌కు నిద్ర పట్ట లేదు. ప్రక్క గదికి జడ్సన్ ఉన్న గదికి మధ్యలో ఒక కార్డు బోర్డు అట్ట మాత్రమే అడ్డుగా ఉన్నది. అందువల్ల చనిపోవుటకు సిద్ధముగా ఉన్న ఆ రోగి యొక్క మూలుగులు స్పష్టముగా వినబడు తున్నాయి. మరణించేవాడు భయపడు చున్నాడేమో? నేను వెళ్లి కొంచెం ధైర్యపరుస్తాను అనుకుని జడ్సన్ ప్రక్క గదికి వెళ్లుటకు రెండు అడుగులు వేసాడు. కాని ఏదో తెలియని భయము జడ్సన్‌కు కలిగింది. అక్కడికి వెళ్లే అలోచనను విరమించుకుని చెవులు గట్టిగా మూసికొని పండుకున్నాడు. అయినా ఆ మూలుగులు వినిపిస్తానే ఉన్నాయి. కొంత సమయము గడిచిన తరువాత ఆ మూలుగులు

వినిపించ లేదు. అయినా జడ్సన్‌కు నిద్ర రాలేదు. ఉదయమే లేచి సత్రపు యజమానిని ఆ రోగి గురించి వాకబు చేసాడు.

"అతడు చనిపోయాడు" అని సత్రపు యజమాని జవాబు ఇచ్చాడు.

"అతడు ఎవరు? ముసలివాడా?"

"కాదండీ! అతనికి కూడా నీ వయసే ఉంటుంది."

"అతని పేరు?"

"జాకబ్ ఎర్మ్స్. బ్రౌన్ యూనివర్సిటీలో చదివాడు."

జడ్సన్ ఆ మాట వినగానే స్థాణువు అయినాడు. మూడు గంటల పాటు కూర్చున్న కుర్చీలో నుండి లేవలేక పోయాడు. జాకబ్ మరణానికి ఎంతో భయపడినట్లు రాత్రి అతని

మూలుగులే తెలియజేస్తున్నాయి. జడ్సన్ అనేకమంది క్రైస్తవులు మరణించుట చూసి ఉన్నాడు. వారెంతో ప్రశాంతముగా నిశ్చింతగా మరణించుట గమనించాడు. కామన్ సెన్స్ పుస్తకములో వ్రాయబడినదంతా అబద్ధము. ఒక వేళ అది నిజమైతే జాకబ్ మరణించే ముందు భయపడేవాడే కాదు. అతడు వెంటనే తిరిగి ఇంటికి తిరిగి వచ్చి తండ్రిని క్షమించమని అడిగి బైబిలు సరియైనదే అని హృదయ పూర్వకంగా విశ్వసించాడు. అండోవర్‌లో ఉన్న విలియమ్ బైబిలు కళాశాలలో చేరి వేదాంత విద్యను అభ్యసించాడు. 1803 డిసెంబరు 2వ తేదీన యేసు ప్రభువును రక్షకునిగా అంగీకరించాడు. ఆ నాటి నుండి తన పేరు ప్రతిష్ఠల గురించి ఆలోచించుట మాని దేవునిని ఎలా మహిమ పరచాలా? అని అలోచించ సాగాడు. తనకు ఇష్టమైన పాట చాటించుడి యేసు నామము తరచు పాడుకునేవాడు.

1715 లో జీగన్ బాల్గ్ గారు క్రొత్త

నింబంధనను తమిళ్ భాషలోనికి తర్జుమా  చేసిన విషయమును చదివాడు. జర్మనీకి చెందిన ష్వార్ట్స్ గారు 50 సంవత్సరముల పాటు భారతదేశములో సువార్త ప్రకటించిన విషయమును చదివాడు. తాను కూడ అటువంటి పని చేసి యేసు ప్రభువును ఎరుగని అనేకులకు సువార్త ప్రకటించాలని ఆశించాడు. అండోవర్‌లో ఇటువంటి ఆశ కలిగిన 5 గురు యువకులు ఉండేవారు. వారి పేర్లు సామ్యేల్ నాట్, (ఈయన బొంబాయిలో సువార్త ప్రకటించారు) సామ్యేల్ మిల్స్ , జేమ్స్ రిచర్డ్, లూథర్ రైస్, బోర్డన్ హాల్. కాలేజీకి దగ్గరలో ఉన్న ఒక అడవి లోనికి ఈ ఆరుగురు యువకులు వెళ్లి ఉజ్జీవము కొరకు ప్రార్థన చేస్తూ ఉండేవారు. యేసు ప్రభువును ఎరుగని అనేకులకు సువార్త ప్రకటించాలని ఆలోచిస్తూ ఉండేవారు. తాము చైనా వెళ్లాలా? భారత దేశము వెళ్లాలా? బర్మా వెళ్లాలా? అని ఆలోచిస్తూ అక్కడకు వెళ్లుటలో గల సాధక బాధకములను బేరీజు

వేసేవారు. వెళ్లవలసిన ప్రాంతము బహు దూరములో ఉన్నది. అక్కడి భాష తెలియదు. అక్కడి వాతావరణము తమకు అనుకూలమైనది కాదు. అక్కడి ఆహారము తమకు అలవాటు లేనిది. అయినా ప్రభువు చిత్తము నెరవేర్చాలని దృఢ నిశ్చయముతో ప్రార్థన చేస్తూ ఉండేవారు.

ఆ సమయములో జడ్సన్ తండ్రి స్నేహితుడైన ఎడ్వడ్ గ్రిఫిన్ గారు బోస్టన్‌లో ఒక పెద్ద చర్చికి పాస్టరుగా ఉండేవారు. అతడు జడ్సన్ యొక్క శక్తి యుక్తులు గమనించి బోస్టన్ వచ్చి తనకు సహాయ పాస్టరుగా పని చేయవలసినది అని కోరాడు. జడ్సన్ తల్లి దండ్రులు ఎంతో సంతోషించారు. కాని జడ్సన్ నిరాకరించాడు. "నేను వెళ్లవలసిన దూరము ఎంతో ఉన్నది" అన్నాడు. ఆ రోజులలో ఇతర దేశములకు సువార్త ప్రకటించుటకు వెళ్లే మిషనెరీలు లండన్ నుండే వెళ్లేవారు. అప్పటి వరకు అమెరికా నుండి ఒక్క మిషనెరీ కూడ విదేశములకు వెళ్లలేదు.

అందువల్ల జడ్సన్ ఇంగ్లాండులో ఉన్న లండన్ మిషనెరీ సొసైటీ ప్రసిడెంట్‌యైన డాక్టర్ బోగ్ గారికి ఉత్తరము వ్రాసాడు. జడ్సన్ ఉత్తరము వ్రాసిన సంగతి అండోవర్‌లో ఉన్న కొంత మంది పాస్టర్లకు తెలిసింది. అందువలన అండోవర్‌లో ఉన్న పాస్టర్లందరూ సమావేశమై తామే ఒక సొసైటీని స్థాపించాలని తలపోసారు. ఆ విధముగా అమెరికన్ బోర్డ్ ఫర్ ఫారెన్ మిషన్స్ 1810 జూన్ 28న స్థాపించబడింది.అది స్థాపించబడుటకు జడ్సన్ దీముఖ్య కారణము.

జడ్సన్‌కు లండన్ సొసైటీ నుండి ఆహ్వానము వచ్చుట వలన అతడు ఇంగ్లాండుకు బయలుదేరాడు. అతడు ప్యాకెట్ అనే ఓడలో ఇంగ్లాండు వెళ్ళుచుండగా సముద్ర దొంగలు ఆ ఓడను వశపరచుకొని ప్రయాణికులందరినీ ఫ్రాన్స్‌లో బందీలుగా ఉంచారు. నాలుగు నెలల పాటు జడ్సన్ బందీగా ఉన్నాడు. అతనిని చూసిన ఒక అమెరికా

వ్యక్తి జైలు నుండి తప్పించుకొనుటకు జడ్సన్‌కు సహాయము చేసినందున అతడు 1811 మే 6 తేదీన లండన్ చేరాడు. లండన్ సొసైటీవారు అతనిని చేర్చుకొనుటకు ఇష్టపడ్డారు. కాని తాము నిర్ణయించిన ప్రదేశములకు మాత్రమే వెళ్లాలి అని షరతు పెట్టారు. అందువలన జడ్సన్ తిరిగి అమెరికాకు వచ్చి తన స్నేహితులతో కలిసి భారత దేశము వెళ్లాలని సంకల్పించాడు.

ఆ సమయములో భక్తిగల ఆన్ హెజల్‌టైన్ అనే యువతిని చూసాడు. ఆన్ టీచరుగా పనిచేస్తున్నది. ఆమె ఒక సంఘపెద్ద యొక్క కుమార్తె. ఆమెను చూసిన వెంటనే తనకు తగిన భార్య అని జడ్సన్ అనుకొని ఆమె తండ్రికి తన ఇష్టాన్ని తెలుపుతూ ఉత్తరాన్ని వ్రాసాడు. ఆన్ తల్లిదండ్రులు భారత దేశమునకు మిషనెరీగా వెళ్లే అబ్బాయిని వివాహమాడుటకు నీకు సమ్మతమైతే నీ ఇష్ట ప్రకారము చేయి అని తమ కుమార్తెకు

నిర్ణయించుకునే అవకాశమును ఇచ్చారు. ఆన్ అంగీకరించినందు వలన 1812 ఫిబ్రవరి 5న వారి వివాహము జరిగినది. సరిగ్గా 14 రోజుల తరువాత వారిద్దరూ కలకత్తా వెళ్లే ఓడను ఎక్కారు. జడ్సన్ స్నేహితుడైన సామ్యేల్ నెవల్ కూడ తన భార్యతో కలిసి అదే ఓడలో ఈ నలుగురు కలకత్తా చేరారు. కలకత్తా వెళ్లిన తరువాత దేవుడు ఎక్కడికి వెళ్లమని ఆజ్ఞాపిస్తే అక్కడికి వెళ్లాలని వారు నిర్ణయించుకున్నారు.

ప్రయాణము చాల రోజులు పట్టింది. ఆ కాలములో బ్రిటీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ వారు తమ వర్తకమునకు ఇబ్బంది కలుగునని సువార్తికులను భారత దేశములోనికి అనుమతించ లేదు. నాలుగు నెలల సుదీర్ఘ ప్రయాణము తరువాత కలకత్తా చేరారు. అప్పటికే కలకత్తాలో ఉండి బైబిలును భారతీయ భాషల లోనికి అనువదిస్తున్న డాక్టర్ విలియమ్ కేరీ గారు వీరికి స్వాగతము

పలికారు. మూడు నెలలు వారంతా కలిసి ఉన్నారు. మిగిలిన మిషనెరీలు అయిన సామ్యేల్ నాట్ గారు, నాట్ గారి భార్య గోర్డన్ హాల్ గారు, రైస్ గారు కలకత్తా చేరారు.

వీరంతా సువార్త ప్రకటించుటకు వచ్చారని బ్రిటీష్ గవర్నమెంటు వారికి తెలిసి వారిని పిలిపించి అక్కడ సువార్త ప్రకటించుటకు అనుమతి లేదు గనుక వారు వెంటనే తిరిగి అమెరికాకు వెళ్లిపోవాలని కలకత్తా నుండి మొదట బయలుదేరే ఓడ ఎక్కి వెళ్లిపోవాలని ఆజ్ఞ జారీ చేసారు. మారిషెష్ వెళ్లే ఓడలో రెండు టిక్కెట్లే ఉండుట వలన నెవెల్ గారు తన భార్యతో మారిషెష్ వెళ్లుటకు ఓడ ఎక్కారు. తరువాత వెళ్లే ఓడలో మిగిలిన మిషనెరీలు అందరూ మారిషెష్ వెళ్లారు. ఏడు నెలల ప్రయాణము తరువాత వారు మారిషెష్ చేరి నెవెల్ గారి భార్య ప్రసవిస్తూ చనిపోయినదని తెలిసికొని దుఃఖించారు. నెవెల్ గారు సిలోను వెళ్లారు. రైస్ గారు అమెరికా వెళ్లారు.

మారిషెష్ నుండి జడ్సన్ గారు మద్రాసు చేరారు. మద్రాసు నుండి 1812 జూలై 13 తేదీన బర్మా లోని రంగూన్ చేరారు. ఆ రోజులలో బర్మాను పరిపాలించే రాజులు బహు క్రూరులు. చిత్ర హింసలు చేయుట ద్వారా లేదా మరణ శిక్ష అమలు చేయుట ద్వారా ప్రజలను తమకు విధేయులుగా ఉంచుకొనేవారు. ఎదురు తిరిగిన వారిని నిర్దాక్షిణ్యముగా శిక్షించేవారు. బౌద్ధ మతము అధికారిక మతముగా ఉండేది. బౌద్ధ మతాన్ని వ్యాప్తి చేయుట రాజు యొక్క కర్తవ్యములలో ఒకటి. చాల తక్కువ మంది కథోలిక శాఖకు చెందిన వారు ఉండేవారు. ఎవరైనా కథోలిక మతమును అనుసరించాలని ఆశిస్తే వారిని చచ్చేవరకు కొట్టేవారు. విగ్రహారాధన ఎక్కువగా ఉండేది. ఆలయ పూజారులు ఎంతో అధికారాన్ని, ధనాన్ని కలిగి ఉండేవారు. రాజు వారిని ఎంతో గౌరవించేవాడు. పన్నులు ఎంత అధికముగా ఉన్నాయో, శిక్షలు ఎంత

కఠినముగా ఉన్నాయెూ విలియమ్ కేరీ గారి కుమారుడైన ఫీలిక్స్ శిరమ్ పూర్‌లో ఉన్న తండ్రికి ఉత్తరము వ్రాసాడు. అక్కడ సువార్త ప్రకటించుటకు వెళ్లుటకు ఎవరూ ధైర్యము చేయలేదు. ఇటువంటి పరిస్థితులలో జడ్సన్ గారు బర్మా చేరారు. సువార్త ప్రకటించబడితే ప్రతి విధమైన అవినీతి, దుష్టత్వము రూపుమాప బడుతుందని ఆయన విశ్వాసము.

బర్మా ప్రజలు విద్యావంతులు. బుద్ధుని యొక్క బోధలు వ్రాయబడిన తాళ పత్ర గ్రంథములు వారి వద్ద ఉన్నవి. సువార్తను ప్రకటించుటకు వెళితే మీ గ్రంథములు ఎక్కడ? అని ప్రశ్నించేవారు. వారికి బోధించుటకు బర్మా భాష నేర్చుకొనవలసి వచ్చింది. ఆయన కొన్ని కర పత్రికలు వ్రాసి అచ్చు వేసారు. బర్మా చేరిన మూడు సంవత్సరాలలో రాత్రింబగళ్లు కష్టపడి ఆ భాషను నేర్చుకున్నారు. విపరీతమైన పరిశ్రమ చేయుట వలన ఆయన అనారోగ్యము పాలైనాడు. బర్మా చేరిన నాలుగు సంవత్సరాల

తరువాత జి.హెచ్. హోగ్ గారు తన భార్యతో జడ్సన్‌కు సహాయము చేయుటకు రంగూన్ వచ్చారు. వారి కూడ ఒక అచ్చు యంత్రమును తీసుకొని వచ్చారు. ఆ అచ్చు యంత్రమును కేరీ గారు వారికి బహుకరించారు. వెంటనే దానిని ఉపయోగించి వేయి కరపత్రికలను ముద్రించారు. నూతన నిబంధనను తర్జుమా చేయుట ప్రారంభించి మత్తయి సువార్తను తర్జుమా చేసారు.

ఇటువంటి పని చేయుటకు ఎంతో ప్రశాంతమైన వాతావరణము కావలెను. కాని ఈ నాలుగు సంవత్సరములలో ఎన్నో ఆటంకములు, సమస్యలను జడ్సన్ ఎదుర్కొన్నారు. వారు ఉంటున్న మిషన్ బంగ్లా శ్మశానమునకు దగ్గరగా ఉండేది. అందువల్ల కొన్ని క్రూర జంతువులు తిరుగాడుతూ ఉండేవి. అంతలో ఆయన భార్య ఆన్ వ్యాధి గ్రస్తురాలైనది. రంగూన్‌లో మంచి డాక్టర్లు లేనందువలన ఆమె మద్రాసు వెళ్లి చికిత్స

చేయించుకుని మూడు నెలల తరువాత తిరిగి వచ్చింది. వారికి పుట్టిన కుమారుడు ఎనిమిది నెలలు రాకముందే మరణించాడు. నాలుగు సంవత్సరములు గడిచినా ఒక్కరు కూడ క్రైస్తవ్యము స్వీకరించ లేదు. కాని జడ్సన్ బర్మా భాషపై పట్టు సాధించాడు. మరొక కర పత్రిక ప్రచురించాడు. విశ్రాంతి లేకుండా పని చేయుట వలన జడ్సన్ గారి ఆరోగ్యము క్షీణించింది. అందువల్ల చిట్టగాంగ్‌లో డాక్టర్ వద్దకు వెళ్లి చికిత్స చేయించుకొని రావాలని అనుకొన్నారు. అక్కడికి వెళ్లి వచ్చుటకు మూడు నెలలు పడుతుంది అనుకొనినను తిరిగి వచ్చుటకు 9 నెలలు పట్టింది. వేగంగా వీచే గాలులు వారి ఓడను ఎక్కడకో తీసుకొని వెళ్లి పోయినవి. వారి ఆహారము మితముగా ఉండెడిది. ఆకలి వలననూ. నీరసము వలననూ అతడు జ్వర పీడితుడై ఉండగా గాలికి కొట్టుకొని పోయిన ఓడ చిట్టగాంగ్‌కు బదులు మచిలీపట్నము వచ్చినది. అదృష్టవశాత్తు బ్రిటీషు జాతీయుడు

జడ్సన్‌ను చూసి అతనిని చేర్చుకొని కొద్ది రోజులు పోషించాడు.

అక్కడ రంగూన్‌లో అతని భార్య పరిస్థితి కూడ ఎంతో దయనీయముగా ఉన్నది. కొద్ది రోజులలో తిరిగి వస్తాడనుకున్న భర్త నెలలు గడిచిపోయినా తిరిగి రాలేదు. ఏ కబురూ తెలియ లేదు. వారికి స్నేహితుడుగా ఉన్న బ్రిటీషు వైస్రాయ్ ట్రాన్స్‌ఫర్ అయి ఒక క్రొత్త వైస్రాయ్ వచ్చాడు. క్రొత్త వైస్రాయ్ హోగ్ గారిని పిలిచి "మీరు ఎందుకు ఇక్కడ ఉన్నారు? నిజం చెప్పకపోతే మరణ శిక్ష విధిస్తాను" అన్నాడు. జడ్సన్ గారి భార్య ఆన్ తాము భాష నేర్చుకొనుటకు వచ్చినాము అని చెప్పి ఆ గండాన్ని గట్టెక్కించింది. అంతలో రంగూన్‌లో కలరా వ్యాపించింది. ఇంగ్లాండుకు, బర్మాకు యుద్ధము రాబోవుచున్నదను వదంతులు వ్యాపించినవి. అందువలన బ్రిటీషు నౌకలు అన్నీ రంగూన్ విడిచి వెళ్లిపోయినవి. ఒకే ఒక్క ఓడ మిగిలి ఉన్నది. హోగ్

గారు ఆ ఓడలో ఇంగ్లాండు వెళ్లిపోయారు. భర్త వస్తే తాను లేకపోతే ఆయన కంగారు పడతాడని ఆన్ ఒంటరిగా ఉండిపోయినది. మరి ఇద్దరు మిషనెరీలు కోల్‌మన్ గారు, వీలాక్ గారు బర్మాలో సేవ చేయుటకు వచ్చి ఆన్‌కు అండగా నిలబడ్డారు.

జడ్సన్ గారు తిరిగి వచ్చిన తరువాత ఒక సత్రమును నిర్మించారు. తరచు యాత్రికులు విశ్రాంతి తీసుకొనుటకు అక్కడికి వచ్చేవారు. జడ్సన్ గారు వారికి సువార్తను బోధిస్తూ ఉండేవారు. ఎన్ని సంవత్సరములు గడిచినా ఒక్కరు కూడ క్రీస్తును అంగీకరించ లేదు. జడ్సన్ గారి మంచితనము అనేకులను ఆకర్షించేది. కాని క్రొత్త మతమును స్వీకరించుటకు వారెవరూ సిద్ధముగా లేరు. 7 సంవత్సరముల 4 నెలలు గడిచిన తరువాత మౌంగ్ నావ్ అనే వ్యక్తి ప్రభువును అంగీకరించాడు. మరి కొద్ది రోజులలో ఇంకొక ఇద్దరు ప్రభువును అంగీకరించారు.

మరికొందరు ప్రభువును అంగీకరిచుటకు సిద్ధముగా ఉన్నారు కాని ప్రభుత్వమునకు భయపడుచున్నారు. అందువలన జడ్సన్ మరియు కోల్‌మన్ గారు రాజును దర్శించి వివరించ వలెనని తలంచారు. కొన్ని బహుమతులను తీసుకొని ఆవా అనే నగరములో ఉన్న రాజు వద్దకు బయలు దేరారు. బైబిలును బంగారపు ఆకుతో చుట్టి రాజుకు బహుకరించారు. తాము మత ప్రచారము చేసికొనుటకు అనుమతి ఇవ్వవలసినది అని విన్నవించుకున్నారు. రాజుకు ఒక కర పత్రికను ఇచ్చారు. రెండు లైన్లు చదివి రాజు ఆ కర పత్రికను ప్రక్కన పడవేసాడు. బైబిలు అందించినా నిర్లక్ష్యంగా పక్కన పెట్టాడు. "మీరు ఎందుకు అనుమతి అడుగుచున్నారు? పోర్చుగీసు వారు, ఇంగ్లీషు వారు, ముస్లిములు ఇంకా అనేకులు ఇక్కడకు వచ్చారు. వారి మతాన్ని వారు అనుసరించారు. మీరు మాత్రమే ప్రచారము చేసుకుంటామని అనుమతి

అడుగుతున్నారు. మీకు అనుమతి ఇవ్వబడదు. మీ మత గ్రంథముతో మాకు పని లేదు. మీరు వాటిని తీసుకొని వెళ్లి పొండి" అని రాజు అన్నాడు. చిట్టగాంగ్‌లో చాల మంది బర్మా భాష మాట్లాడే ప్రజలు ఉన్నారు. బర్మా వదలి అక్కడికి వెళితే వారికి సువార్త ప్రకటించ వచ్చునని జడ్సన్ అనుకున్నాడు కాని మాంగ్ నావ్ "మీరు వెళ్లిపోతే మాకు క్రీస్తును ఎవరు బోధిస్తారు? కనీసము పది మంది రక్షించబడే వరకు మీరు ఇక్కడే ఉండండి" అని బలవంత పెట్టారు. త్వరలోనే సంఘము అభివృద్ధి చెంది పది మంది బాప్తిస్మము తీసుకున్నారు.

అంతలో జడ్సన్ దంపతుల ఆరోగ్యము క్షీణించింది. వైద్యము కోసము కలకత్తా వెళ్లారు. ఆన్ యొక్క ఆరోగ్యము మరింతగా క్షీణించుట వలన ఆమెను అమెరికా పంపాలని నిశ్చయించారు. ఆన్ అమెరికా వెళ్లిన తరువాత జోనాతాన్ ప్రైస్ అనే డాక్టరు గారు తన భార్యతో రంగూన్ వచ్చాడు. కాని

5 నెలలలోనే డాక్టరు గారి భార్య మరణించింది. జోనాతాన్ గారు కంటి ఆపరేషన్లు చేయుటలో నేర్పరి. అందువలన రాజు ఆయనను రమ్మని కబురు పంపాడు. జోనాతాన్ గారికి భాష రాదు గనుక తర్జుమా చేయుటకు జడ్సన్ గారు కూడ వెళ్లారు. వైద్యము చేసే సమయములో రాజోద్యోగులకు, రాజు బంధువులకు సువార్తను ప్రకటించారు. తాము రంగూన్‌లో ఉండుట కంటే ఆవా నగరములో ఉండుట మంచిదని జడ్సన్ తలంచారు. అంతలో బ్రిటీషు వారు బర్మాపై దండయాత్ర చేసారు. అందువలన విదేశీయు లందరినీ అరెస్టు చేసి జైలులో పెట్టారు. డాక్టర్ ప్రైస్ గారు, జడ్సన్ గారు 21 నెలలు జైలులో ఉన్నారు. అమెరికా నుండి తిరిగి వచ్చిన ఆన్ జైలుకు కొద్ది దూరములో ఉన్న ఒక పాకను అద్దెకు తీసుకొని అందులో నివసించేది. జైలు చాల అసౌకర్యముగా ఉండేది. అపరిశుభ్రముగా ఉండేది. వంద మంది కలిసి ఒకే గదిలో ఉండేవారు.

దుర్వాసన భరింపరానిదిగా ఉండేది. 14 పౌండ్లు బరువుగల సంకెళ్లు జడ్సన్ గారికి కాళ్లకు, చేతులకు వేయబడ్డాయి. అవి చేసిన మచ్చలు చనిపోయే వరకు పోలేదు. ఖైదీలకు వారి బంధువులే ఆహారము పెట్టాలి. ఆన్ గారు జడ్సన్ గారికి, ప్రైస్ గారికి రోజూ ఆహారము తీసుకొని వచ్చేది. యుద్ధము తీవ్రమైనది. ఖైదీలందరినీ 9 మైళ్ళ దూరములో ఉన్న మరొక జైలుకు తరలించాలని నిర్ణయించారు. ఖైదీలందరినీ సంకెళ్ళతో బంధించి 9 మైళ్లు నడిపించి మరొక జైలుకు మార్చారు. బైబిలు వ్రాత ప్రతులను ఆన్ దూది మధ్య పెట్టి ఒక తలగడ తయారు చేసింది. అందువలన అవి నాశనము కాకుండా భద్రము చేయబడినవి. బ్రిటీషు వారు రాజధాని వరకు జయిస్తూ వచ్చారు. రాజుకు తమ మాటలు బ్రిటీషు వారికి అనువదించే వ్యక్తి కావలసి వచ్చింది. అందువలన జడ్సన్‌ను విడుదల చేసారు. జడ్సన్, అతని భార్య బాగా శుష్కించి ఉన్నారు. కాని బ్రిటీషు

వారు వారిని ప్రేమించి వారి గురించి ఎంతో శ్రద్ధ తీసుకొన్నారు. అందువలన వారు స్వస్థులైనారు.

ఆన్ సరియైన విశ్రాంతి లేనందు వలననూ చిన్న బిడ్డకు పాలు ఇవ్వవలసి వచ్చుట వలననూ తన 37వ ఏట ప్రభువు నందు నిద్రించింది. దానియేలు, యోనా గ్రంథములను ఆమె బర్మా భాష లోనికి తర్జుమా చేసినది. మత్తయి సువార్తను థాయ్ భాష లోనికి తర్జుమా చేసినది. ఆమె మరణించిన 6 నెలలకు జడ్సన్ చిన్న కుమార్తె (2 సంవత్సరముల 3 నెలల వయస్సు) ప్రభువు నందు నిద్రించినది. మరి మూడు నెలలకు తన తండ్రి మరణించిన టెలిగ్రామ్ అతనికి అందినది.

బ్రిటీషు రాజు తర్జుమా చేసినందుకు 7,200 రూపాయలను పారితోషికంగా ఇచ్చాడు. అయితే నేను మిషను పనివాడిని అందువలన ఈ డబ్బు మిషనుకు చెందుతుంది అని 7,200 రూపాయలు మిషను బోర్డుకు ఇచ్చివేసాడు. ఇప్పుడు

బర్మాను బ్రిటీషు వారు పరిపాలించు చున్నారు గనుక కొన్ని సమస్యలు తగ్గినవి. అతనితో కలిసి సేవ చేయుటకు వేడ్ దంపతులు, బ్రాడ్ మెన్ దంపతులు వచ్చారు. వారు ఒక స్కూలును స్థాపించారు. జడ్సన్ క్రొత్త నిబంధనను ప్రింట్ చేసాడు. 13 కర పత్రికలను ప్రింట్ చేసాడు. బర్మాకు వచ్చే మిషనెరీల సహాయార్థము ఒక నిఘంటువును తయారు చేసారు. బర్మా భాష - ఇంగ్లీషు, ఇంగ్లీషు - బర్మా భాష నిఘంటువులు ప్రింట్ అయినవి.

సంఘము దిన దినము అభివృద్ధి చెందింది. మూడు చర్చిలు నిర్మించ బడ్డాయి. సుమారు 200 మంది బాప్తీస్మము తీసుకున్నారు. రక్షణ పొందిన బర్మా దేశీయులు తామే సువార్త ప్రకటించుట ప్రారంభించారు. వారిలో అతనితో కలిసి సేవ చేయుటకు వేడ్ దంపతులు, బ్రాడ్ మెన్ దంపతులు వచ్చారు. వారు ఒక స్కూలును స్థాపించారు. అందరూ సంతోషంగా ఉన్న

సమయములో బ్రాడ్ మెన్ గారు ప్రభువు నందు నిద్రించారు. ఇంకా కొందరు మిషనెరీలు వచ్చినారు వారిలో శారా క్యూమింగ్స్ గారు, ఎలియనోర్ మెకొంబర్ గారు ముఖ్యులు. వారు మలేరియా అధికముగా ఉన్న ప్రాంతములో పని చేయుట వలన శారా గారు వచ్చిన రెండు సంవత్సరములలోనూ ఎలియనోర్ గారు వచ్చిన 5 సంవత్సరములలోను ప్రభువు నందు నిద్రించినారు.

బ్రాడ్ మెన్ గారు ప్రభువునందు నిద్రించిన తరువాత ఆయన భార్య శారా బ్రాడ్ మెన్ మూడు సంవత్సరముల పాటు భర్త వదిలిన పనిని కొనసాగించారు. ఆమె తన చిన్న కుమారునితో ఎంతో కష్టపడుచు సేవ చేసినది. అమెరికాలో ఉన్న ఆమె స్నేహితులు తిరిగి వచ్చేయమని ఎన్ని సార్లు కోరిననూ ఆమె తాను స్థాపించిన స్కూలులు మూత పడునని తిరిగి రాలేదు. జడ్సన్ గారి భార్య చనిపోయి 8 సంవత్సరములు అయినది. విధవగా ఉన్న బ్రాడ్

మెన్ గారి భార్యను జడ్సన్ వివాహము చేసికొన్నారు. నిర్విరామ పనుల వలన జడ్సన్ గారి ఆరోగ్యము క్షీణించినది. ఊపిరి తిత్తుల వ్యాధి వలన కంఠ స్వరము చిన్న బోయినది. ఆయన ప్రసంగించ లేడు గనుక సాహిత్య సేవను చేయుట ప్రారంభించినారు. దాదాపుగా 21 సంవత్సరములు ఆయన చేసిన నిర్విరామ కృషి వలన బైబిలు తర్జుమా చేయుట పూర్తియైనది. బర్మా పండితులు అది ఎంతో చక్కని తర్జుమా అని ప్రశంసించినారు. 300 సంవత్సరముల తరువాత నేటికీ మరొక్క తర్జుమా అవసరము లేదని అందరూ భావించి యున్నారు.

ఆరోగ్యము క్షీణించినను అమెరికాకు తిరిగి రమ్మని మిత్రులందరూ పిలిచినను అతడు బర్మాను విడువ లేదు. వాతావరణములోని మార్పుల వల్ల అతని చిన్న కుమారుడు హెన్రీ ప్రభువు నందు నిద్రించినాడు. శారా జడ్సన్ గారి ఆరోగ్యము క్షీణించినందు వలన జడ్సన్ ఆమెను, ముగ్గురు పెద్ద

పిల్లలను ఇద్దరు సహాయకులతో లండన్ వెళ్లుటకు బయలు దేరారు. తమ ముగ్గురు చిన్న పిల్లలను బర్మాలో ఉన్న మిషనెరీల సంరక్షణలో ఉంచారు. అయితే మార్గ మధ్యములోనే శారా ప్రభువు నందు నిద్రించినది. తల్లి లేని పిల్లలతో జడ్సన్ బోస్టన్ చేరినాడు. అతడు చేసిన సేవలను గుర్తించిన ప్రజలు బ్రహ్మాండమైన స్వాగతము ఇచ్చినారు. ఆయన గొంతు పోయినందువలన మాట్లాడ లేక అతి క్లుప్తముగా ప్రసంగించినాడు. ఒక వార్తా పత్రికలో జడ్సన్ పౌలు వలె, యోహాను వలె సేవ చేసినాడని వర్ణించినాడు. అందుకు ఈ దీన సేవకుడు తనను పౌలు తోను ఇంకెవ్వరితోను పోల్చవద్దని తాను క్రీస్తును అనుకరించ వలెనని ఆశించు చున్నాను. యేసు ప్రభువు మనవలె శోధింప బడినను పాపము లేని వానివలె ఉన్నాడు. ఆయన బోధలను అనుసరించాలని ఆశిస్తున్నాను. ఆయన అడుగు జాడలలో నా పాదములు పెట్టవలెనని చెప్పాడు.

తన ఇద్దరు కుమారులను అమెరికాలో వదిలి జడ్సన్ బర్మా చేరాడు.

అతడు చేసిన కృషి వలన అతనితో అనేకులు బర్మాలో మిషనెరీలుగా పని చేయుటకు అతని వెంట వచ్చారు. 3 సంవత్సరములు బర్మాలో ఉన్న తరువాత అతడు మరలా వ్యాధి గ్రస్థుడైనందున అమెరికా వెళ్లుటకు ప్రింటింగ్ ప్రెస్‌ను పర్యవేక్షిస్తున్న రన్నే అనే వ్యక్తిని తోడుగా ఇచ్చి ఓడ ఎక్కించాడు. నడువలేని జడ్సన్‌ను అనేకులు మోసుకొంటూ ఓడ ఎక్కించారు. అతడు మరణావస్తలో ఉన్నాడని గుర్తించిన అనేక మంది బర్మా జాతీయులు ఏడుస్తూ వీడ్కోలు చెప్పారు. ఓడ బయలు దేరిన తరువాత నాలుగు రోజుల పాటు జీవించిన జడ్సన్ 1850 ఏప్రిల్ 12వ తేదీన ప్రభువు నందు నిద్రించాడు. అతని మృత దేహమును ఆ రోజే సముద్ర జలాలలో జారవిడిచారు. అంత్యదినమున సముద్రము తనలో

ఉన్న మృతులను అప్పగించెను; ప్రకటన 20 : 13

ప్రస్తుతము బర్మాలో సుమారు 43 లక్షల మంది క్రైస్తవులు ఉన్నారు. జడ్సన్ గారు దీనికి మొదటి విత్తనము వేసినారు. ఆయన 38 సంవత్సరములు అలుపెరుగని క్రీస్తు సైనికుడు. 7,000 మందిబాప్తీస్మము తీసుకొనుటకు కారకుడు. 63 సంఘములను స్థాపించినవాడు. 1812 ఫిబ్రవరి 19న అతడు మొదటి అమెరికా మిషనెరీ. తరువాత 163 మంది మిషనెరీలు బర్మాలో సేవ చేయుటకు సమర్పించుకొనుటకు ప్రేరణ ఇచ్చినవాడు. ఇటువంటి వారినే ప్రభువు భళా! నమ్మకమైన మంచి దాసుడా అని ప్రశంసించును.

**దేవుని మహా కృపనుబట్టి ఇంకా అనేక సాక్ష్యములు రాబోవుచున్నవి. కావలసినవారు సంప్రదించండి.**
**www.gospelneedsindia@gmail.com**

